The First Telugu Bi-weekly in Andhra Desa_The only Telugu Newspaper
for H E H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

103354

సం॥ చందా రూ ౬-౦-౦
అర్ధ ,, ,, ౩-౧౨-౦
విడి ప్రతిక ౦-౧-౪

హైదరాబాదు, (దక్కను.)
GOLKONDA PATRIKA
HYDERABAD, Dn.) SATURDAY 26-11-32

ఒకవారము తరువాత ప్రతికలకోరిన ప్రతిని పంపుట పరిమితి లేదు

సంపుటము ౬ } శా. శ. ౧౮౫౪ ఆంగీరస సం॥ కార్తీక బ॥ ౧౩ శనివారము ౨౨-౨-౧౩౪౨ ఫ॥ { సంచిక ౯౬

## అస్పృశ్యతా నివారణము
### సవర్ణులధర్మము

మహాత్మా గాంధిగారి క్రొత్త సందేశము

అస్పృశ్యతా నివారణోద్యమ వ్యాప్తికై హరిజనులేమి చేయగలరని అస్పృశ్యులలో రాజభోజరాజుగారొకరే యడిగినారు. అయితే సవర్ణ హిందువులలో అనేకులు పురుషులు, స్త్రీలు, విద్యార్థులు తమ పూర్వ వ్యాపారములకు భంగము లేనటుల తామే సహాయము చేయగలమని అడుగుచు వ్రాసిన జాబులు నావద్ద కట్టలు కట్టలున్నవి. అస్పృశ్యతా ప్రతిఘటనోద్యమమును జనసామాన్యమునకు సమన్వయింపజేయుటకు హృదయ పరివర్తనము, హరిజనులయెడల వృత్తియందు మార్పును ముఖ్యములు. కావున హరిజనులకు సేవజేయుటకు సవర్ణ హిందువులు తమ నిత్య కర్మలకు భంగము కలిగించుకొన వలసిన యవసర ముండదు.

మొదట తన జీవితమునందు అస్పృశ్యతా నివారణముయొక్క పూర్ణార్థమును ప్రతియొకరును చక్కగా తెలిసికొన వలయును. హరిజనులు పబ్లికు దేవాలయములలోనికి ప్రవేశించుటకును, పాఠశాలలు, వీధులు, ఆసుపత్రులు, వైద్యశాలలు మొదలగు పబ్లికు స్థలముల నుపయోగించుటకును, యింతియేల రాజ్య తంత్రము లకు సంబంధించిన హక్కులయందును సంఘ విషయములందును మత విషయము లందును తమతో సమానమగు స్థానమును పొందుటకు తనకే యభ్యంతరము లేకపోవుటయేగాక, అట్లు జరుగుట తనకండ్లతో చూచుట కిష్టముకూడ యుండు-చో, అతడుకాని యామెకాని తనమట్టుకు తాను చేయవలసిన దంతయు చేసినటులే యగును.

అయితే పృచ్ఛకులు కోరినదిగాని నాకు తృప్తిగల్గించునది గాని అంతమాత్రిముగాదు అంతేవరకు తమ కార్యమును నెరవేర్చిన తరువాత ఉద్యమవ్యాప్తి కంకను తామేమిచేయగలమని వారు తెలిసికొనగోరియున్నారు అట్టిపృచ్ఛకులు

సంపాదించిన జ్ఞానమును తోళ్లపని వారితో వ్యాపింపజేయ వలెను. లేదా వారొకటి చేయవచ్చును. శవముల బారవేయుటయందు అనుసరింపబడు యాచారమును గమనించి తోళ్లపనివారు చేసినసేవకు దగినకూలి దొరకునటుల జేయవచ్చును.

ఇంకను సామర్థ్యమున్న, కాలమున్నగి లవారు హారిజనులకు రాత్రి పాఠశాలల నేర్పరుపవచ్చును. హారిజన బాలురను తోటవిందులకును వినోదముల జూచుటకును సెలవుదినములలో దీసికొని బోవచ్చును. లేదా సమయము చిక్కినప్పుడెల్ల హారిజనుల యిండ్లకే బోయిచూడ వచ్చును. అవసరమైనచోట్ల వైద్య సహాయము నిప్పింపవలయును. ఇట్లన్ని విధములను వారు సామాన్యముగా మరియొక జన్మమెత్తి సలులను నిరస్త్రహిందూజనమునకును తమకును ఏలాటి సంబంధము లేదనియువారు గ్రహించునట్లు జేయవచ్చును.

ఇపుడు నేను వర్ణించినపని నంతయు విద్యార్థులు సుఖముగాను చక్కగాను జేయగలరు. ఈపని స్త్రీపురుషు లనేకులు వివేకముతోను, నిశ్చయముతోను, ఉత్సాహముతోను మౌనముగాచేయ లేని మన కోరిక సఫలమగుటకు మనమెంతో చేసినవారమగుదుము. నేను వర్ణించినదిగాక పెక్కు విషయములు గలవు. అవన్నియు గమనింపదగినవే. అయితే నాసంచారములలో నాకు కనబడినవాటిలో అనేకములలో కొన్నిటిని మాత్రమునేను దెల్పినాను.

---

## బెంగాలు పబ్లికు సెక్యూరిటీ బిల్లు: బెంగాలు శాసన సభ

సెలెక్టు కమిటీ విచారణ కంపుట

నవంబరు ౨౩ వ తేదినాడు బెంగాలు శాసనసభలో హోంమెంబరు బెంగాలు పబ్లికుసెక్యూరిటీ బిల్లును సెలెక్టు కమిటీ విచారణకు పంపవలెనని సూచించెను. తనసూచనను సమర్థించుచు బెంగాలులో కాంగ్రెసువారు ప్రభుత్వమువారితో సవాలుగట్టి దాని నింకను ఉపసంహరింపలేదనియు, ఇందువలన రాజశాసనములకును క్రమ పరిస్థితులకును భంగము వాటిల్లుచున్నదనియు, ఇట్టిచేయును తొలగించుటకై ప్రభుత్వమువారికి ఉండు సామాన్యాధికారములు చాలకున్నవనియు, అందుకై ఈబిల్లు ఉద్దేశింపబడినదనియు, కాంగ్రెసువారు ప్రభుత్వమువారితో చేయు సవాలు మానుకొన్నగానే యీబిల్లు యిచ్చు అధికారములు కూడ ఉపసంహరింపబడుననియు జెప్పెను.

అనధికార సభ్యులు, ఈ బిల్లు అనవసరమనియు, అంతియగాక అశాంతిని ప్రబలించి విప్లవకారులకు మరింత ప్రోత్సాహము నొసగగలదనియు, విప్లవకారులను కాంగ్రెసువారిని ఒక్క వర్గమున చేర్చుటచే ప్రభుత్వమునకు సహాయముచేయదలచిన వారికి కూడ వెగటును పుట్టించుననియు, వాదించిరి.

ఈ బిల్లు శాసనమైన తరువాత ౧౯౩౦ వ సంవత్సరము డిసెంబరు నెల౩౧ వ తేదివరకు అమలునందుండు నటుల ఏర్పరుపబడినది ప్రస్తుతము డిసెంబరు ౩౧ వ తేదితో స్పెషల్ పవర్సుఆర్డినెన్సుకాలము ముగియ బోవును గనుక ఈ బిల్లు అవసరమేర్పడెను.

బిల్లును అనధికారసభ్యులు ప్రజాభిప్రాయమునకై సర్క్యులేషను చేయవలెనని కోరిరి. కాని వాటికి ౧౭ ఓట్లే వచ్చి ౬౬ గురు ప్రతికూలురైరి. ఇందువలన ౧౧ మెంబర్లుగల ఒక చిన్న కమిటీ బిల్లును విమర్శింప వలెనను హోం మెంబరు గారి కోరికయె నెగ్గెను.

---

## అసెంబ్లీలో ఆర్డినెన్సు బిల్లుచర్చ

యస్. సి. మిత్రగారు ఉద్యోగముల క్లాజును తీసివేయమని ఓడుట

బహిష్కారపు క్లాజును తీసివేయమనిన జాగుగారోడుట

బహిష్కారపు క్లాజు తీవ్రతను తగ్గించు యత్నములు వ్యర్థమగుట

ప్రభుత్వమువారు మూడునెలలశిక్ష నారునెలలు చేయు యత్నము మానుట

క్రొత్తఢిల్లీ; నవంబరు ౨౩,౨౪

అసెంబ్లీలో ౨౩ వ తేదివాడు ఆర్డినెన్సు బిల్లు చర్చ జరిగెను. యస్. సి. మిత్రగారు సర్కారు ఉద్యోగములకు సంబంధించిన క్లాజును తీసివేయుమని ఒకమార్పు సూచించెను. దానిపై చర్చ జరిగినతరువాత సమ్మతుల గ్రహింపగా ౬౧ మంది ప్రతికూలురును ౩౩ మందిమాత్రమనుకూలురును అయిరి. అందువల్ల సవరణ ఓడెను.

౨౪ వ తేదియంతయు మరల ఆర్డినెన్సుబిల్లే చర్చింపబడెను. నాల్గవక్లాజు చర్చ జరిగెను. అది పబ్లికు ఉద్యోగుల బహిష్కారమునకును, వారిని చిక్కుపెట్టుటకును సంబంధించినది. జాగుగారు ఆక్లాజును తీసివేయవలెనను సవరణ నుపపాదించిరి. దీనిపై చర్చజరిగెను. ఓట్లు తీసికొనగా ౩౦ మంది అనుకూలురును ౬౬ మంది ప్రతికూలురు నగుటచే సవరణ ఓడింపబడెను. మిత్రగారు యితరులగు అనధికారులును ఆక్లాజుయొక్క తీవ్రతను తగ్గించు సవరణల నెన్నింటినో యుపపాదించిరి. అవియు ఓడెను

కట్టకడపట లామెంబరుగారే ఒక సవరణను కోరిరి. ఇందుమూలమున సెలెక్టు కమిటీవారు సూచించిన ౩ నెలల శిక్షను ౬ నెలల దానిసగాగా మెంబరుగారు చేయగోరిరి.

మహమ్మదు యాకూబుగారును, మిత్రగారును; శారదాగారును, జాగుగారును; చట్టము యొక్క ముఖ్యోద్దేశమునకు గాక మాటకుమాత్రము ఉల్లంఘన చూపినందుకు అంత శిక్ష తరగతని లామెంబరుగారి సవరణను ఖండించిరి.

పండితు సేనుగారుగూడ ఖండించుచు ఉపన్యసించుచుండ లామెంబరుగారు అధ్యక్షునితో యేమో చెప్పిరి. అధ్యక్షుడు ప్రభుత్వమువారు యీసవరణకై నిర్బంధింపరని మాకు తెలియుచున్నదనెను. అందుకు అందరు సంతోషించిరి. లామెంబరు సవరణను ఉపసంహరించెను.

హైగుగారు సభవారు కోరుచున్నట్లు యిట్లు చేసితిమని విశదీకరించెను. ౫ వ క్లాజు చర్చ జరుగుచున్నది. (అ. ప్రె.)

---

## దొంగరైల్వే టిక్కెట్లు

నిందితులను సెషన్సుకు పంపుట

ముజఫర్పూరు నవంబరు ౨౩

రైల్వేటిక్కెట్ల విషయమున మోసము జరుగుచుండిన సందర్భమున అరెస్టు చెయబడిన నిందితులను స్పెషలు మేజిస్ట్రేటు గారు కుట్రమోసములను నేరము దొంగచేవ్రాలు అను నేరముల నారోపించి సెషన్సు విచారణకు పంపినారు. ఇద్దరు మాత్రము వదలిరి అందులో ధోలీ అసిస్టెంటు స్టేషనుమాస్టరు గలరు. (అ. ప్రె.)

---

## ఆంధ్ర పత్రికాశిక

పునరుద్ధరింపబడుట

ఆంధ్రుల యార్థిక పారిశ్రామిక సాంఘిక రాజకీయ స్వాతంత్ర్యములకును సారస్వతాభివృద్ధికిని అభివృద్ధి చెందవలసిన జాతుల జన్మస్వత్వముల కాపాడుటకును చెన్నపురి నుండి యేబది వత్సరములనుండి కీ. శే. యే.సి. పార్థసారథినాయుడు గారిచే స్థాపింపబడి కొంతకాలముగా నిలిచియున్న యీపత్రికను పునరుద్ధరించు ప్రయత్నములు జరుగుచున్నవి. ప్రస్తుతము కలవరపెట్టుచున్న సమస్యలన్నియు నిష్పక్షపాత బుద్ధితో విమర్శింపబడుటయేగాక గలసంపాదకులెటుల బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదములకు తావీయక ప్రజాసేవజేసెనో యటుల ప్రజాసేవకై కొందరు దేశభక్తులగు యువకులచే యీపత్రిక యీమాసాంతమునుండి ప్రచురింపబడనున్నది నిజామాంధ్ర సోదరులెల్లను యీ పత్రికా ప్రచురణమునకు తోడ్పడ ప్రార్థన.

పత్రిక వలయువారికి మాదిరి పత్రిక ఉచితముగా పంపబడును.

డి. అప్పారావు

ఆంధ్ర ప్రకాశికా కార్యస్థానము పాతచాకలిపేట మద్రాసు.

# హైదరాబాదు నగర సంస్కారోపాయములు

## సర్. యమ్. విశ్వేశ్వరయ్యగారికి స్వాగతము

## సర్. యమ్. విశ్వేశ్వరయ్యగారి యుపన్యాసము

హైదరాబాదు, నవంబరు ౨౩ —

నగర సంస్కార కార్యముల సందర్భమున హైదరాబాదునకు సర్. యమ్. విశ్వేశ్వరయ్యగారు వచ్చిరి వారిని సన్మానించుటకై నవంబరు ౨౩ వ తేది, బుధవారము సాయంత్రము పబ్లిక్ గార్డెనులో ఒకగొప్ప ఉత్సవము జరిగినది అందు పురపాలక సంఘమున కుపాధ్యక్షులగు పింగిళి వెంకటరామారెడ్డిగారు విశ్వేశ్వరయ్యగారికిని రాజ్య కార్యనిర్వాహక వర్గమున కధ్యక్షులగు సర్ కిషన్ ప్రసాద్ బహద్దూరుగారికిని, తదితర పౌరశ్రేష్ఠులకును స్వాగతమిచ్చి గౌరవించిరి

విశ్వేశ్వరయ్యగారికి స్వాగతమిచ్చుచు పింగిళి వెంకటరామారెడ్డిగారిట్లు ఉపన్యసించిరి

మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దూరు గారికిని, ఇచటి పెద్దలకును నా మనవి —

నా యాహ్వానము నంగీకరించినయీ సాయంతన ఘనాతిథికి, సర్. యమ్. విశ్వేశ్వరయ్యగారికి తొలుదొల్త నాయు హృదయ వందనము నాకు ఆంగ్లభాషయందు పరిచయము మెక్కువలేదు. దానిని మాట్లాడవలెనని సంతసముతోపుగా నేను మాట్లాడజాలను. అయినను మీరు దయయుంచి యనుమతించినచో నేను మన యతిథిని గురించి కొన్ని మాటలు చెప్పెదను కొంతసేపోర్చి సావధానులగుదురని నా ప్రార్థన,

సర్ యం విశ్వేశ్వరయ్యగారిని గురించి నేను మీకు తెలుపవలసిన యావశ్యకత యుండదని నేను తలచెదను వారి కీర్తికి ఇండియాదేశము యొక్క నాల్గుమూలలు హద్దులు గావు. హైదరాబాదు నందును, హైదరాబాదీయులకును, వారికి పెట్టిన పరిచితులు.

వారీ నగరమునకు వచ్చుటకిది నాల్గవసారియని మీకు తెలియును. వారు మొదట వచ్చినది ౧౯౦౮ వ సంవత్సరములో నగరమునకు మహాప్రవాహము వలన యెంతోగొప్ప నష్టము సంభవించి నప్పుడని మీలో చాలమందికి జ్ఞాపకముండును అప్పుడు హైదరాబాదు సర్కారువారు మరల యిట్టి మీదట అటువంటి యుపద్రవము కలుగకుండుటకు తగు ఉపాయమును సూచించుటకై పిలిచియుండిరి, వారువచ్చి యీనగరమునకు మరియొకసారి అట్టి ప్రాణధనోపద్రవము కలుగకుండ సంరక్షణము నేర్పరచుటయే గాక మనము నగరమందు ఉండగలుగుటకు ముఖ్యాధారమును సూచించిరి సంవత్సరము పొడుగునను లభించు ఏర్పాటులను ప్రసాదించియుండిరి. మనమీ సాయంత్రము కూడిన యీరమణీయోద్యానము కూడ వారి సూచన ననుసరించియే నిర్మితమయ్యెను,

వారిరెండవ దర్శనము ౧౯౨౦ వ సంవత్సరమునందు హైదరాబాదు మురుగు కాల్వల నేర్పాటు చేయు పద్ధతి తెలుపు సందర్భమున లభించెను దీనికి ఒకకోటి రూపాయలు ఖర్చుఅయినవి. చేయవలసిన పనిముగిసి వచ్చినది ఈ నవీన యారోగ్య మార్గము నగరవాసుల యారోగ్య మభివృద్ధిజెందుటకెట్లు ఉపయోగించునో వివేచించి తెలుపవక్కరలేదు.

నగర వృద్ధివలన యానములను అలస్యములేక నడుపు సౌకర్యములును, పాడుగృహములను తొలగించుటకు చేయుసౌకర్యములును అవసరమయ్యెను ఇరుకైనవి విశాలరమణీయములగు సమ్మర్దములు నిర్మితములైనవి ఇదంతయు వారు ౧౯౩౦ లో మూడవసారి నగరమునకు వచ్చిన ఫలితము. ౩౦ మైళ్ళు గచ్చులు కల రోడ్లున్నవని గర్వింపదగిన నగరము ఇండియాకంతయు హైదరాబాదొకటేయని నేనిసందర్భమున తెలుప నిచ్చెను, ఈ మైళ్ళయింకను ఎక్కువయగుచున్నవి

మన నగరమును నవీన మొనర్చుటకు ఏర్పడిన పలు సమస్యలయందు కుతూహలము గలవారు విశ్వేశ్వరయ్యగారు నాలవసారి వచ్చిన తరువాత వ్రాసిన అద్భుత నివేదికను చదివియుందురు

మహాఘనత వహించిన నిజాముగారు తమప్రజల మైన ఆప్యాయముతో శ్రేయస్సునందు గాఢమగు శాశ్వతమగు అభిమానమును ప్రకటించుచు. అభివృద్ధి స్పష్టమై ఎంతో యెక్కువ ధనమును ఖర్చుపెట్టుచున్నారు మన సర్కారువారు యీ యౌదార్యము నుపయోగించి విశ్వేశ్వరయ్యగారి నివేదికలోని సూచనల నన్నింటిని కార్యరంగమునకు దెచ్చి ఇండియాలో హైదరాబాదు నగరమువంటిది లేదని మనము చెప్పుకొనదగినటుల చేయుట మంచిది

వీరి యిప్పటి రాకవలన యేమి సంభవించునో చెప్పజాలము కాని ఒకటిమాత్రము నమ్మకముగా చెప్పవచ్చును అదేమనగా అందు వీరి రాకవలెనే, యిప్పటి దర్శనము కూడ మన నగరాభివృద్ధి చరిత్రమునందు సదా స్మరణీయము కాగలదు

విశ్వేశ్వరయ్యగారు హైదరాబాదునకు చేసిన సేవలను గురించి నేనింతవరకు సంగ్రహముగా చెప్పినాను. ఇంక వారి యితరకార్యముల గురించి నేను చెప్పెదను, దయతో వినుడు.

విశ్వేశ్వరయ్యగారు భారతీయులైనను అన్నిదేశముల యందును ఖ్యాతిగాంచినవారు వారు తమ జన్మభూమియగు మైసూరునకు దివానుగా నుండినప్పుడే వారి చురుకుబుద్ధియు పరిపాలనా పాటవమును ప్రసిద్ధికెక్కెను వారుఆసంస్థానమందు అనేకకార్యములను చేసియుండిరి వాటివలన సంస్థానమున కాదాయమందును ప్రజలకు ఐశ్వర్యమందును మంచివృద్ధి కలిగినది. వారిహృదయస్వభావము మనవళ్ళకీ యుప్రశస్తములని స్పష్టముగా చెప్పుటకే కార్యము లుచాలును. వాటిలో రెండు కార్యములను మాత్రము చేర్కొనెదను అవి కన్నంబాడి కట్ట, కృష్ణరాజ యినుపపనులు. వారి ప్రసిద్ధి నిది యెల్లపుడును స్మరింపజేయుచుండును తన సంస్థానపు హక్కులను సమర్థించుటకు మదరాసు ప్రభుత్వము వారితోను, యిండియా ప్రభుత్వమువారితోను, కనికరములేక పోరాటముసల్పి, వారి సలహాల గట్టితనమును సవాలుచేసిన విశ్వేశ్వరయ్యగారు చరిత్రపురుషులైనారు. సముద్ర ఘట్టములతో సంబంధమును సంపాదించి మైసూరు వాణిజ్యము నభివృద్ధిజేయుటకు వీరు యత్నించిరి కాని వీరు అసమయమున ఉద్యోగమును వదలుట వలన మైసూరునకు అప్రయత్నము నెరవేరు యదృష్టము లభింపదయ్యెను, త్వరితముగ మైసూరు పరిశ్రమల వృద్ధియు, వారు మైసూరు దివానుగనుండి, తెలివితేటలతో అన్ని ఏర్పాటులను గావించి మొదట పురిగొల్పుటవల్లనే జరిగినది మైసూరులోని చిన్నకొండలమీద నుండు వేసవి మకాములలో వారు చేసిన మంచి మార్పులు ఆచటి ప్రజలకేగాక బయటినుండి వచ్చువారికి కూడ తప్పక హాయి కలిగించును వీరిని జాచిన రాజ్యతంత్ర వేత్తలును, రాజకార్య ధురంధరులును శాసనసభా న్యాయవాదులలో నుండి చెప్పలేనంత మాట అసత్యమని తేలును. వీరిస్మృతి యింజనీరింగు మరి సహాయము వచ్చినప్పుడెల్ల వీరు రాజకార్య ధురంధరత్వమును రాజనీతి తత్వవిత్త్వమును ఒక తరగతివారి సొత్తుమాత్రము కాదు అనియు యితరులుగూడ అంతమాత్రమో లేక అంతకంటె మించినవారుగనో నుండవచ్చుననియు ఋజువుచేసిరి.

ఇంక నేను మన సాయంతన ఘనాతిథిని సంబోధించెదను,అయ్యా, హైదరాబాదు నగరముగాని, దాని సమస్యలుగాని మీకు క్రొత్తవిగావు మీరు సూచించు ఉపాయముల నన్నింటిని మేము ఆసక్తిమతో గమనించుచున్నాము అయినను యిప్పటిచట్టము ననుసరించి వాటిని కార్యరూపమున పరిణమింపజేయుటకు శీఘ్రము చేయజాలకున్నాము. అయినప్పటికిని ౬౨ సంవత్సరములనుండి స్థానిక శాసనసభ ఆసనము దాగలివిూద నుండిన పురపాలక శాసనము త్వరలోనే నిజమగు ప్రజాప్రతినిధులకు నగరపాలక విషయములందు ప్రధమాధికారము లభించునని యాశించుచున్నాము,

అయ్యా, తమదర్శనమువలన మాకు ఉత్సాహమును ధైర్యమును ఎక్కువ యగుచున్నవి. త్వరలోనే మా పురపాలక వర్గమునకు అభివృద్ధిజెందిన యితర నగరముల పాలకవర్గములతో పోటీపడుచు పనిచేయుటకు తగిన శక్తులు అధికారములు లభించునని యాశించుచున్నాము.

అయ్యా, మీరు మాతోజేసి మాకొసంగిన మెప్పుమాటలకు మీకు పునర్వందనము.

నా యాహ్వానమును దయతో నంగీకరించి యిచటికి వచ్చినందులకు మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరువారికిని యితరులగు పెద్దలకును వందనములు,

తరువాత సర్ యమ్. విశ్వేశ్వరయ్యగారు మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దరుగారిని, పింగిళి వెంకటరామారెడ్డిగారిని, తదితరులగు పెద్దలను సంబోధించి ప్రత్యుత్తరము క్రింది విధమున నుపన్యసించిరి,

నగర పాలకవర్గమున కుపాధ్యక్షులగు రెడ్డిగారు నగరవాసులను ఈ యుత్సవమునందు కలిసికొనుటకు నన్నాహ్వానించి గౌరవించి నందులకును, నన్ను గురించి ప్రియమైన విషయముల జెప్పినందులకును, నా యుహృదయ వందనములను వారికి సమర్పింప వలయునని ఈ సమయమున నా మొదటితలంపు.

దాదాపు ౨౫ సంవత్సరముల నుండి పలుమారు నాకీ సంస్థానపు యింజనీర్లతో సంబంధము కలిగినది. మీనగరమును బాగుచేయుటకు యింజనీరింగు ఉపాయములను పన్నుటయందును, ఆయుపాయములను నెరవేర్చుటయందును నేను ఆదరము వహించియుంటినని ఉపాధ్యక్షులు తమ యుపన్యాసమున చెప్పినటుల, ఈకారణము వలననే నాకీ గౌరవము జరుగుచున్నది.

౧౯౦౮ లో మూసీనది ఉపద్రవకరమైన ప్రవాహముతో గట్లుపొంగి నగరమంతయు ధ్వంసము జేసెను. అదియే నేను హైదరాబాదుకు మొదట వచ్చుటకు కారణము ఆ ప్రవాహము ధ్వంసము గావించిన కొద్దికాలమునకు ఇండియా మంత్రిగారు సముద్ర తంత్రీవార్త నొకదానిని పాకండ జేసిరి. అందులో నేను యిండియాకు మరలివచ్చి ఈనగరమునకు భవిష్యత్తునందు వరదల యుపద్రవము కలుగకుండ నాపుటకు ఉపాయములను పన్నుటలో సహాయుడనుగ నుండుటకు ఆహ్వానముండెను నేనప్పుడు ఇటలీలో సంచారము చేయుచుంటిని. సముద్రతంత్రీమూలమున కొంతకాలము ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినతరువాత, నేను నాసంచారమును ముగించినతరువాత అపనికి పూనుకొనవలెనని యనుకొంటిమి నేనట్లే ౧౯౦౯ ఏప్రిలు నెలలో హైదరాబాదునందు ఉద్యోగమున జేరితిని ఉపాయములను పూర్తి జేయుటకు నాకు ౭౪ నెలలు పట్టెను అవి పూర్తియైనతోడనే మొదట యనుకొన్నటుల నేను నిర్మాణ ప్రారంభమునకు చేయవలసిన ఏర్పాటులన్నిటిని జేసి, సంస్థానమును వదలితిని

(౧౬-వ పేజీ చూడుడు)

# పల్లెటూరి ప్రజల నివేదనము

## తహసీల్దారుగారి వీడుకోలుపు విందు

వ్యర్థమగు ఖర్చులేకుండుట

(సూర్యాపేటవిలేఖరి)

శ్రీ॥ శ్రీధరరావు తహసీలుదారు గారు ఇచ్చటనుంచి తబాదిలా అయ్యెనందున అచ్చటి పరపతి సంఘమువారి పక్షమునను క్లబ్బుపక్షమునను రెండువిందులు జరిగినవి అందు స్థానికవుద్యోగస్థులు వకీళ్లు మొదలగు ప్రముఖులు శ్రీ వారి సద్గుణగణములను ప్రశంశించుచు ఫలహారములనొసగిరి. ఈ సందర్భమున ఇదివరలో వీడుకోలుపులయందు జర్గినట్లుగా యేవిధమయిన నిరర్థకమగు ఖర్చుజరుగలేదు.

పరపతి సంఘవార్షికోత్సవము
సూర్యాపేట

త్రివర్ణపతాకముతో ఉద్ధూ బాషయందున గరముఖ్యవీధుల యందు కీర్తనలు సలిపిన తరువాత స్థానిక మాధ్యమిక పాఠశాలయందు గొప్పసభ సమావేశపర్చబడెను పతాకమువెంట రక్షకభటులును వాలంటియరులును బాలురు తీరి కీర్తనలుబాడుచుండగా బహుజనసందడియందు గొలుపుచుండెను జనాబు మొహతేమీం అప్పాసి గారి అధ్యక్షత క్రింద మహాజనసభ జరుపబడెను. పెక్కు వందలమంది నాల్గువర్ణములవారు వుండిరి ప్రథమమున పరపతి సంఘ పక్షమున పరపతి సంఘములు యూరపులో స్థాపించిననాటినుండి పొందుచుండిన లాభములును మన రాష్ట్రమున స్థాపించిన నాదిగ నేటివరకు వుండిన సంఘములును తెలుపబడెను పెక్కుమంది పెద్దలును మదరసా విద్యార్థులును తదితరులును పరపతి సంఘమువలన లాభములను వెల్లడించిరికాని సంఘమువారు చేయుచున్న పనిని ప్రజలకు యెట్లు బోధించవలయునో బీదలకొరకెట్లు పాటుపడవలయునో బీదలు బాగుపడుటకు చేయవలసిన అవసర మేమిటియో ధనవంతులు తమ ధనమును సంఘమునందుంచి దానివల్ల పొందు లాభ మేమిటియో బోధించి పల్లెటూరులయందుండు ప్రజలకు దేశభాషలయందు బోధించినయెడల బాగుండునని యెవరు సూచించలేదు.

పేష్కారుగారు తహసీల్దారు పదవికి పోబోవుదురని విందులు జరుపుట

స్థానిక పేష్కారుగారు తహసీలుదారు పదవికి వెళ్లుదురని వదంతులుకలవు వీరికొరకు యిద్దరు గిర్దావరులవల్లను యింక యితరులవల్లను మూడు విందులు మహావైభవముగా జరపబడినవి చిత్ర పక్వాన్నములు, మాంసము కూరలును, చేయించి విందు జరుపబడెను. స్థానిక వుద్యోగస్థులలో జనాబు ముకసవు సా॥ గారును సైకవికారు సర్కారుదును ఆబ్కారి దారోగా మొదలగువారును మహమ్మదీయ యుద్యోగస్థులును పంక్తికిగల గ్రామనివాస మహమ్మదీయులును విందులలో పాల్గొనిరి. రెండవ గ్రామమునుండి వచ్చిన కళావంతులును స్వగ్రామమువారి కాంతలును గానసభల జరిపిరి యీపేష్కారుగారు చాలా వుస్తుములు న్యాయశీలురు బీదలకు కల్పతరువు వీరు తమ కచహారియందు ఉద్యోగస్థులకు లంచములు సాదరుఖర్చులు మామూళ్లు యివ్వవద్దని ప్రకటనలు చేయుచుండువారు తాము వెళ్లబోవు స్థలమందు కూడా రయితుల హక్కులను కాపాడి బీదల ఆదరణకు పాత్రులగుదురని లోకులనకొనుచున్నారు.

## మండలాధిపతిగారి సన్మానపు ఖర్చు ఎంత?

నిజము తెలియదు

మండలాధికారి గారికి సన్మాన సభకొరకు రెండుమూడు వేల రూపాయిలు వసూలు అయినవని వదంతులు కలవు ఆహ్వానసంఘ పక్షమున విందులకొరకును గానసభ కొరకును భోజనముల కొరకును ఇతర అలంకారముల కొరకును యెంతే వ్యయము అయినది ఇందుకొరకు అభిమానులలో యెవరెవరెంత ధనము సమర్పించినది తెలువనందున పలుగురు పలువిధము లనుకొనుచున్నారు అట్లు అనుటకు తావులేదు

ఘనపట్టి రోషినిపట్టి

అందాజా మూడు వెయిల రూపాయిలవరకు నియమించినారనియు ఇట్టి రూపాయిలు వసూలు చేయగలందులకు పట్వారికి శక్తి వచ్చునగనియు అట్టిరకము లెక్క చూచుకొని దాఖలు చేయవలయునని టంటమా వేయబడిండి యీ గ్రామం మామూలుది అంత పెద్దబస్తి కాదు. ఇట్టిపన్నును భరించె శక్తి లేనివారు అనేకులు గలరు యీగ్రామంకొరకు వేరె సౌకర్యములు చేయవలసిన అవసరములు లేవు లోకల్‌ఫండు సమావేశములే లేవు- లోకల్‌ఫండు వలన చేయవలసిన సౌకర్య ... సిన చాలున యిట్టి పెక్కును వసూలు ... చేయవలసిన సౌకర్యము లేమిటియో ఇప్పుడు వుండబడిన కుదువ యేమిటో ఇదివరలో ప్రజలు తమ కేమయిన సౌకర్యములు కావలెనని మొరపెట్టుకొనిరా. ఆకార్యము నెరవేర్చుటకు లోకల్‌ఫండు రక్షించాలదా? ఇది యెవరుకోరినందున వచ్చినదని చాలామంది బీదలు గందరగోళ పడుచున్నారు. యీగ్రామం షుమారు ఇంచుమించు ౧౧ వందలుండవచ్చును. ఇందులో గ్రామమునకు ౧-౨ మైళ్లదూరమున నున్న రెండు లంబాడి గుడిశెలును యర్కల యానాది మొదలగువారి తలుపు తాళం దరువాజలు తడ్కలులేనివి వక అధరణమునకె 3-౪-౫-౬ దరువాజలుగల వాటితో కూడా కలిసివున్నవి. ప్రజాభిమానము గలవారు న్యాయవాదులు ఘనపట్టి, రోషిణిపట్టి యేయేస్థళములయందుండ తగినదో తెలసినవారు తెలిపినయెడల బీదసాదలు వారి కృతజ్ఞతకు పాత్రులగుదురు.

వర్తకసంఘము ధర్మాదాయము

ప్రప్రథమమున వర్తకసంఘము సూర్యాపేటయందె స్థాపించబడి కొంత మూలధనము వసూలు జేసియుండెను. అందుమీదట రాబడిన యిబ్బందులను దయివానుగ్రహంవల్ల తెలిపోబడి పూర్వమునుండి వుండబడిన బాధలు యేమిలేకుండా పోయినవి. ఆసమయమున వర్తకమువలన రాబడే ధర్మాదాయము నుండి గ్రంథాలయమునకు భజనమందిరమునకు మొదలగు దేశహిత కార్యములకు వినియోగపర్చుటకు వాటాలు నిర్ణయించి గ్రాంటుచేయించి అదేవిధముగా కొన్ని సంవత్సరములు జరిపిరి. నేటికి నాలుగు సంవత్సరములు క్రమక్రమేణ వర్తకవృద్ధి యగుచున్నది. ధర్మాదాయము రాబడుచున్నది. కాని దాని అడుగువాడలేరు. ఇచ్చువారు అంతకు లేదు అనుకున్నవి అడుగుపట్టినవి చాలామంది వర్తకులు స్వంతమునకొనినారు. ఇట్లు జరుగుచుండగా నికడు సంవత్సరం శ్రీ కందుకూరి వెంకట నరసింహారావు దేశముఖుగారు వర్తకుల పిలిపించిధర్మాదాయము నుండి స్థానికపత్రమునకు రాబడినుండి సగము యివ్వవలెందులకు ఆజ్ఞాపించగా సంఘమువారినన్నదున ప్రత్యేక ప్రత్యేకముగా పిలిపించి నిసబుతీసుకొనిరి. యీపత్రికమునకు వచ్చువారు పార్టీలవారైన, గ్రామ బంధువులలో వారైన, శ్రీవైష్ణవులు బ్రాహ్మలు తరుచుగా వచ్చెదరేకాని మునాఫ యక్కువరాబడులేదు.

సర్వ కార్యాదులయందు ఉపయోగించును
అన్ని తైలములలో భూతనాథ తైలము రాజువంటిది.

# భూతనాథ కేశ తైలము

మలయగిరి పుష్పసువాసనలనుకూడా లజ్జింపచేయునటువంటి భూతనాథ తైలము. ఒకసారి వాడిచూచిన ఇతర సువాసనవల తైలములయం దాసక్తిని వదలించును. ఇది వాడుటచే అకాలమునందు వెంట్రుకలు నెరయుట, బుద్ధిమాంద్యము, తలనొప్పి, అలసట మొదలగు శిరోవ్యాధులను నిర్మూలింపజేసి కేశవ మూలమును ధృవపరచి బుద్ధిని వికాసింపచేసి వెంట్రుకలను పట్టుపించమువలె మృదుపరచి వికాసింపచేయును. ఇది అన్నివిధములైన శిరోరోగములను నిర్మూలించుటయేగాక సుగంధ పరిమళాదులచే తయారు చేయబడు నటువంటి సువాసనగలది. కావున అన్ని తైలములకంటె మా భూతనాథ తైలము రాజువంటిది,

వెల సీసా ౧ కి రూ॥ 0-13-0.

వలయువారలు యీక్రిందిఅడ్రసులో తెప్పించుకోవలసినది.

నైజాము రాష్ట్రమునందు సోల్ఏజంట్సు:
మె. వి. రాంలింగం, నెం॥ 1392, జనరల్ బజారు, శికింద్రాబాదు.

---

CASTOPHENE REGD.

మలబద్ధము తొలగిపోవును,
కడుపుకు బలమొసంగుటకును.
దివ్యౌషధము

మలబద్ధము మీ ఆరోగ్యమును చెరుపును. తలనొప్పి, బలహీనత, జలుబు, అజీర్ణము మున్నగునవి కలిగించును. దీని పోగొట్టుకొనుటకు కాస్టొఫీన్ తియ్యని విరేచనాకారియగు చాక్లేట్ నుపయోగించుడు; ఇది అన్ని బాధలతొలగించును అన్నకోశమును. కొజ్జమును బాగుపరచును. విషపదార్థములను దేహమునుండి తొలగించును.

కాస్టొఫీన్ నెమ్మదిగను, సురక్షితముగను, పనిచేయును అభ్యాసము లేకుండ జేయునట్టిది. ఇది వాడుటకు ఆహ్లాదకరముగను, చాక్లెటువలె రుచికరముగను. నుండును అన్ని ఔషధ విక్రయశాలలలో దొరకును. ౯ చాక్లెట్లుగల పాకెటు వెల ౨ అణాలు ౭౨ గల సీసావెల ఒక రూపాయి

కాస్టొఫీన్ మాను ఫాక్చరింగ్ కంపెనీ (ఇండియా)
పోస్టుబాక్సు నం. ౮౮. కరాచీ
కెమిస్టులందరి వద్దదొరకును.

Castophene ManufacturingCo (India)
P.O. B No 88 KARACHI

---

# గృహ చికిత్స

నానారోగములు, నాడీవ్యాధులు, దగ్గు, తలనొప్పి, వెన్నుపోట్లు, పంటినొప్పి, రొమ్మునొప్పి, మొదలగు బాధల నివారించు దివ్యౌషధము.

ప్రస్తుతము అనేకరకముల బాములచేతను అంజనములచేతను దుకాణములు నింపబడుచున్నవిగాని ఇంతవరకు గుణమునందునూ "ఇండోబాము"ను మించినదిగాని, సాటియైనదిగాని లేదు.

దీనిని గొప్ప డాకట్లు పరీక్షించి; అన్ని అంజనములకంటె బాములకంటెను, శ్రేష్ఠమైనది అనినిర్ణయించి ౧౯౨౫ సం॥లో వెంబ్లీ భూములో జరిగి ప్రదర్శనమునందు బంగారుపతకము నొసగిరి, అన్ని మందుల షాపులయందును, లేక సోల్ యేజంట్ల వద్దనైనను దొరుకును.

INDO BALM
PAIN RELIEVED

జె. ఫాస్టు అండు కో
కెమిస్ట్సు అండ్ డ్రగ్గిస్ట్సు సికింద్రాబాదు

**J. FAUST & Co.,**
Chemsts & Drggists, Secunderabad.

---

# స్వదేశీ స్టేషనరి కావలయునా?

అన్నిరకముల స్వదేశీ కాగితములను స్టార్ ఇండియా పెన్సిళ్లను. ప్రింటింగుఇంకులుమావద్దయెల్లప్పుడు సిద్ధముగా నుండును, వ్యాపారస్థులకు మాపుస్తకములపై వారికోరిన విధముగా ముద్రించి యిచ్చెదము. పాఠశాలలనుండి జిల్లాలనుండి వచ్చు ఆర్డర్లను జాగ్రత్తగా విచారించెదము. ఉత్తరప్రత్యుత్తరములు ఇంగ్లీషులో జరుపవలెను.

ది దక్కన్ కమర్షియల్ కంపెనీ
(మదారిసు పెన్సిళ్లకు ఏజంట్లు)
గౌలిగూడ, హైదరాబాదు)

---

# డోంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వలన
బలహీనతను
పోగొట్టును
బిడ్డలకు బలమునిచ్చి
సౌఖ్యము కలిగించును

ఒక బుడ్డి వెల ౧ రూపాయి
పోస్టు ఖర్చులు ౫ అణాలు.
ఎల్ల చోటులందును దొరకును.

K. T. DONGRE & Co,
GIRGAUM, BOMBAY

---

నకలు మందులను చూచి మోసపోకుడు

# అమృతాంజనము

అన్ని నొప్పులకు దివ్యామృతము

ఆసేతుహిమాచలపర్యంతము నలువది సంవత్సరములవిఖ్యాతి గాంచినది

నొప్పుల కన్నింటికి వజ్రాయుధము వంటిది

గోలకొండ హైదరాబాదు ఏజంట్లు:—
గోవర్ధనదాసు, గోపాలదాసు, వర్తకులు, ఇసామియాబజారు హైదరాబాదు దక్కను.

RFG No N 45 RegNo.M.2185

STAMP

Printerand publisher by G, Rama krishna Reddy at the Golkonda power Press, Hyderabad Editor K Balakrishna Reddy,